శ్రీమతేరామానుజాయనమః.



# శ్రీవాక్యగురుపరంపరకును

పూర్వాచార్యతనయులుకును

శ్రీరహస్యత్రయమునకును

శ్రీరామస్తవరాజచిత్రసీసమునకును

పూర్వాచార్య గ్రంథానుసరణి

శ్రీమహాభాగవతదాస శ్రీమద్రామానుజైకశరణ్య

ముత్తీవి వేంకటతిరుమలదాసునిచే

తెనుగు ప్రతిపదార్థము రచియింపబడి

నూజివీడు వాస్తవ్యులును తత్సంస్థానాస్థానవిద్వాంసులునగు

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల అప్పలాచార్యులవారిచేతను.

కోరుకొండ నివాసులగు

విద్వాన్ శాంతలూరు కృష్ణమాచార్యులు వారిచేతను.

సమ్యక్పరిశోధింపబడి.

బృందావన పురమందలి

శ్రీఆర్యానంద ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడి ప్రకటింపబడియె.

మొదటికూర్పు

దీనివెల రు 0—4—0

# అవతారిక.

రెండవలోకానర్థకము. పైనజెప్పిన గృహస్థులగు యాచార్యపురుషులే గాక కొందరుసన్యాసులు యాచార్యత్వమే ముఖ్యమగుదేహయాత్రగా నేర్పరచుకొనిదమయాశ్రమవ్యతిరిక్తధర్మములనగా (యానారూఢ యతింద్రుష్ట్వా సచేలస్నానమాచరేత్) యానారూఢుడగుసన్యాసినిజూచిన(తత్క్షణమే)కట్టుబట్టలతో నేస్నానముజేయవలయునను దానికి విరుద్ధముగా, గజ,తురగ, యానారూఢము మొదలగునధర్మములనాచరించుచుమిక్కిలియాడంబరముతో తమడాంబికముచే పామరుల మోహింపజేయుచు౧౧౧౬ రూప్యము లొసంగినగాని భిక్షకు రామనియును ౧౧౧౬ రూప్యము లొసంగినగాని దివ్యదేశ దేవాలయములలో తీర్థపరిగ్రహము జేయమనియును నుడువుచు తాముజెప్పిన ప్రకారము ధనమిచ్చుటకు నొడంబడినవారివలన నమితధనము గొనుచుండిరిగాని ద్రవ్యాశారహితముగా లోకోపకారమెంతమాత్రము జేయుటలేదు. కేవల పారమార్థికమున కెంతమాత్రము ద్రవ్యవ్యాసరములేదు. శ్రీరామానుజాచార్య లేడిక్లీ మధూకరమెత్తి దేహధారణ జేసికొని లోకోపకారముగతన్మతవ్యాప్తిజేసిరి. శ్రీఆదిశంకరులవారును శ్రీమధ్వాచార్యులవారును గూడ నిహలోకడాంబిక మెంతమాత్రముగోరక సర్వసంగపరిత్యాగులై తమమతవ్యాపకముజేసిరి.

మూడవలోకానర్థకము. యాంధ్రదేశమందలి శ్రీవైష్ణవమతావలంబకులగు గొందరు గోల్కొండవ్యాపారిబ్రాహ్మణులునుకొందరునియోగిబ్రాహ్మణులునుపంచసంస్కారములగుసమయములందునాచార్యులవద్ద తీర్థప్రసాదములస్వీకరించునాచారముకలదు. ఇప్పుడాయాచారమువిపరీతముగ పర్యవసించినది. ఎట్లనినిప్పటికొందరుడంబాచార్యులు తమసాటి బ్రాహ్మణశిష్యులకు తీర్థప్రసాదంబులొసంగుటరిశిష్యుల దర్శనస్పర్శనాదులకెంతమాత్రమెడమియ్యక తాములోపల భుజించుచుదమపుత్రసమానులగు స్వజాతిశిష్యులకుజాత్యంతరులకువలె తీర్థప్రసాదముల వెలుపలబారవేయుచుండిరి. "గ్రామకులాదిగళాలుంపరుంపేరనర్థహేతు" గ్రామకులాదులవలన గల్గుప్రతిష్ఠ అనర్థహేతువను శ్రీవచనభూషణవాక్యార్థమునకువిపరీతముగా తమగౌరవమేతప్పనెదుటివారిగౌరవము నెంతమాత్రముగణింపని నీదురాచారులుజేయు నీదురాచారమిప్పటి నవ నాగరీకులుసహించజాలకయనేక బ్రాహ్మణులీశ్రీవైష్ణవమతముత్యజించిభోజనాదికృత్యంబులందు స్వజాతిగురుశిష్యులకెంతమాత్రముభేదములేనినితరమతములందు ప్రవేశించుచుండిరి. ఇంతమాత్రమునకు వీరుమతత్యాగముజేయుటఎలుకమీదగోపముచే గొంపమీదనిప్పుపెట్టుకున్నట్లున్నది. శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్। లెస్సగానాచరింపబడిననితరధర్మముకంటె, గుణములేనిదైననుతనధర్మమే శ్రేష్ఠమైనదను న్యాయముచేతతమస్వమతమునుగాపాడుకొనుటకు ప్రస

## అవతారిక.

క్తమగు నీదురాచారమును దొలగించుకొనుట యుచితమైయున్నది గాని స్వమతత్యాగమెంతమాత్రము నుచితముగ నుండలేదు.

ఈదురాచారము నొలగించు పద్ధతేదనగ బుద్ధిమంతులగు వారు సద్గురువుల వెదకికొని యాశ్రయించి పంచసంస్కారసంపన్నులై తరువాత తమ పుత్రశిష్యులకు మంత్రమంత్రార్థముల తామే యుపదేశించుచు స్వమతమును గాపాడుకొనుట పరమధర్మమై యున్నది.

### ఆచార్యత్యాగ విషయము.

ఇట్టి సమయములో నే బుద్ధిమంతుడైనను యోగ్యులగు నాచార్యుల వెదకికొని యాశ్రయించినయెడ నట్టి సమయమందా బుద్ధిమంతునకుగాని వారి తాత తండ్రులకుగాని యెవ్వడు నేమి యుపదేశించ నట్టియు నీళ్లైనంతవరకు నేటేట వార్షికశుల్కమును మాత్రము గొనునట్టియు నామమాత్రాచార్యుడు వచ్చి యా బుద్ధిమంతుడాచార్యత్యాగము జేసినాడనియు ను- శ్లో॥ గురుత్యాగే భవేన్మృత్యుః మంత్రత్యాగే కులక్షయం। గురుమంత్రపరిత్యాగే రౌరవం నరకం భవేత్॥ గురువును త్యజించినవానికి మరణము గల్గును. మంత్రము త్యజించినవాని కులక్షయమగును. గురువును మంత్రమును గూడ త్యజించినవానికి రౌరవనరకము గల్గుననియుం జెప్పియున్నదిగాన నా బుద్ధిమంతుడాచార్యత్యాగము జేసినాడనియును యందువలన తనికి సర్వానర్థములు సంభవించుననియును బెదరించుచున్నాడు. గురుత్యాగము అనర్థకరమను మాట నిజమేగాని శిష్యుడెప్పుడైన పరమార్థ విషయముల నుపదేశము నొందినట్టి గురువును త్యజించ గూడదని శాస్త్రములలో జెప్పియున్నదిగాని శిష్యున కెప్పుడు పరమార్థ విషయముల నుపదేశించక వార్షికశుల్కమును మాత్రము గొను నామమాత్రాచార్యుల త్యజించ గూడదను కారికలే శాస్త్రములోను లేదు. అట్టి నామాచార్యుల త్యజించినయెడల పన్ను తప్పిపోవుట మొదలగు లాభము గల్గునేగాని యనర్థకమేమియు గలుగదు. శ్లో॥ భిన్ననావాశ్రయస్త్వబ్ధిం యథా పారం న గచ్ఛతి। జ్ఞానహీనగురుం ప్రాప్య కుతో మోక్షమవాప్నుయాత్॥ ఓటిపడవ నెక్కినవాడెట్లు యొడ్డు నజేరలేడో యట్లే జ్ఞానహీనుడగు గురువు నాశ్రయించిన శిష్యుడెట్లు మోక్షమును బొందగలడు అను న్యాయముచే సద్గురువుల నాశ్రయించు శిష్యున కెంతమాత్రము దోషము లేదు.

ఆచార్యత్వము గ్రామోద్యోగము మొదలగు మిరాసీహక్కువలె వంశపరంపరగా వచ్చునదిగాదు. శ్రీమద్రామానుజులవారి పూర్వాపరాచార్యులు జ్ఞానానుష్ఠానములుగల నాచార్యుల వెదకికొని యాశ్రయించిరిగాని జ్ఞానానుష్ఠానములు లేకున్నను కేవలము గురువంశమే ముఖ్యమని గురువంశపరంపరలో వారి నాశ్రయించలేదు. ఏ చేతనుడైనను తాన

## శ్రీమతేరామానుజాయనమః

ప్రతిశ్రీవైష్ణవ చేతనుడు సద్గురూపదేశమునొంది ప్రాతఃకాలమునలేచిండబొందు పరచిన వాక్యగురుపరంపర మొదలగునవి యనుసంధించవలసినది.

వాక్యగురుపరంపర మొదలగువానికి తెనుగుప్రతిపదార్థముకూడవ్రాయబడినది.

### వాక్యగురుపరంపర.

౧ అస్మద్గురుభ్యోనమః
౨ అస్మత్పరమ గురుభ్యోనమః
౩ అస్మత్సర్వ గురుభ్యోనమః
౪ శ్రీమతేరామానుజాయనమః
౫ శ్రీపరాంకుశ దాసాయనమః
౬ శ్రీమద్యామున మునయేనమః
౭ శ్రీరామ మిశ్రాయనమః
౮ శ్రీపుండరీకాక్షాయనమః
౯ శ్రీమన్నాథమునయేనమః
౧౦ శ్రీమతే శఠగోపాయనమః
౧౧ శ్రీమతే విష్వక్సేనాయనమః
౧౨ శ్రియై నమః.
౧౩ శ్రీధరాయ నమః

తిరుమంత్రము. ఓంనమో నారాయణాయ.

ద్వయమంత్రము { ౧. శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే.
౨. శ్రీమతే నారాయణాయనమః.

చరమశ్లోకము. { శ్లో॥ సర్వధర్మాన్పరిత్యజ్యమామేకంశరణంవ్రజ।అహంత్వాసర్వపాపేభ్యోమోక్షయిష్యామి మాశుచః

శ్లోకరూపవాక్యగురుపరంపర.

శ్లో॥ అస్మద్దేశికమస్మదీయ పరమాచార్యాన్నశేషాన్గురూన్ శ్రీమల్లక్ష్మణ యోగిపుంగవమహాపూర్ణౌ మునింయామునం రామంపద్మవిలోచనంమునివరంనాథం శఠద్వేషిణం సేనేశంశ్రియమిందిరాసహచరంనారాయణంసంశ్రయే

శ్లో॥ ఆచార్యానస్మదీయాన పిపరమగురూన్సర్వమాచార్యవర్గం శ్రీమద్రామానుజాఖ్యం మునిమఖిలజనోద్ధారణాయావతీర్ణం పూర్ణార్యం యామునేయంమునివరమథతౌ రామరాజీవనేత్రౌ వందేనాథంమునీంద్రం.వకుళధరచమూనాథలక్ష్మీముకుందాన్

శ్లో॥ శ్రీరామానుజయోగిసుందరవర శ్రీశైలనాథాన్గురూన్ । లోకార్యోత్తరవీధికృష్ణకలిజిద్వేదాంతభట్టారకాన్ శ్రీగోవిందయతీంద్రపూర్ణయమినావాస్తవ్యరామానుజౌ॥ పద్మాక్షాహ్వాయనాథయోగిశఠజిత్సేనేశపద్మాహరీన్॥

ఇంతవరకు శ్రీవైష్ణవులందరికి పొత్తైయున్నవి. తదుపరి తెంగలవారు శ్రీశైలేశ ఇత్యాదితనియలోను వడగలవారు రామానుజదయాపాత్రంఇత్యాదితనియలోనువారివారి ఆచార్యతనియనను సంధించునది.





శ్రీమతే రామానుజాయ నమః.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.

# వాక్యగురుపరంపరార్థము.



శ్రియఃపతియును, శ్రీవైకుంఠనికేతనుండును, నిత్యముక్తులచేననుభవింపబడువాడును నిరతిశయానందయుక్తుడునగు సర్వేశ్వరుండు (ఈసంసారిచేతనులుగూడ) నానిత్యముక్తులతోపాటు తన్ననుభవించి నిత్యకైంకర్యరసానుభవముగలవారలై సుఖించుటకు ప్రాప్తిగలిగియు దానిని బోగొట్టుకొని (అసన్నేవసభవతి) అసత్తుతోసమానులై భోగమోక్షశూన్యులై (సంయుక్తమేతత్ క్షరమక్షరంచ) ఇదిక్షరాక్షరములతో గూడికొనినదియనునట్లు తిలతైలమువలెను దారువహ్నివలెను విభజించనలవిగానట్టియు త్రిగుణాత్మకమగునట్టియు నతిక్రమింపశక్యముగాని యనాద్యచిత్సంబంధముచేగప్పబడిన స్వప్రకాశముగలవారలైయుండు నీసంసారిచేతనుల దుఃఖమునుతలంచి (సఏకాకీనరమేత) వాడుఒక్కడుగాసుఖింపడు అనియు (వ్యసనేషుమనుష్యాణాం భృశంభవతిదుఃఖితః) జనులదుఃఖమునకు మిక్కిలిదుఃఖించువాడనియును జెప్పినట్లత్యంతవ్యాకులితచిత్తుడై (ఈసంసారిచేతనులు) తమకరణకళేబరముల బోగొట్టుకొని (లూనపక్షఇవాండజః) రెక్కలువిరిగినపక్షివలెనుండునవస్థలో (నామరూపేవ్యాకరవాణి) నామరూపములవిస్తరింపజేసెదననియును (అన్నాళ్ నీతందవాక్కైయిల్ పుగ్గుయ్ త్తేన్) అప్పుడు నీవొసగిన శరీరమార్గమునను వర్తించితిననియుం జెప్పినట్లుచేతనులకు కరణకళేబరంబులొసంగ నీచేతనులునాకరణకళేబరంబులంగొని యోగ్యముగా బ్రవర్తించుటకు దగినశక్తివిశేషములగూడ బరిగ్రహించియు దేహామేయాత్మయను నభిమానమును, అన్యశేషత్వమును, స్వస్వాతంత్ర్యమనుమూడు (బురద) గుంటలలోబడి యనర్థపడకుండ దనను (శ్రీమన్నారాయణుని) యాశ్రయించియుజ్జీవించుట కుపయుక్తమగునటుల (అపదోషమముం ప్రథమం) పోయినదోషముగల నీప్రిభువనునట్లు పౌరుషేయమైనదగుటచే మనుష్యబుద్ధిచేదూషింపబడు దోషములేనిదై (వేదశాస్త్రాత్పరంనాస్తి) వేదశాస్త్రములకంటెనెక్కుడైనది లేదను ప్రమాణమునుంబట్టి వేదశాస్త్రమునుమించిన వేరొకశాస్త్రములేదు గానస్వతఃప్రమాణముగలదగు వేదమును (యోవైవేదాం

3 తదుపరి శ్రీసేనేశులీలీలావిభూతికి వేంచేసియుండ అవతరించిన పొయిగై, భూదత్త పేయాళ్వార్లకును, తిరుమళిశైయాళ్వార్లకును ఉపదేశించిపిమ్మట॥ శ్లో॥ సేనేశస్స్వయమాగత్య ప్రీత్యా శ్రీనగరీం శుభాం। శఠగోపాయమునయే తింత్రిణీమూలవాసినే॥ తాపాది పూర్వకం మంత్రద్వయశ్లోకవరాన్ క్రమాత్ విష్ణుపత్న్యా మహాలక్ష్మ్యా నియోగాదుపదిష్టవాన్॥ సేనముదలియార్లు శుభకరమగు శ్రీనగరికి స్వయముగా వేంచేసి శ్రీతింత్రిణీమూలవాసులగు శ్రీమన్నమ్మాళ్వారికి శ్రీలక్ష్మీదేవియాజ్ఞానుసరణమున పవిత్రమగు తిరుమంత్ర, ద్వయ చరమశ్లోకముల క్రమముగా నుపదేశించెననియును, (మయర్వఱ మదినలమరుళినన్) అజ్ఞానమునశించునట్లు భక్తిరూపాపన్న జ్ఞానముం గృపజేసినాడనియుం జెప్పినట్లు భగవత్కృపాపాత్రులును చేతనకృతార్థత్వసులును ప్రపన్నజనకూటస్థులునగు శ్రీమన్నమ్మాళ్వారికి శ్రీమన్నారాయణుడు శ్రీవిష్వక్సేనులద్వారా శ్రీరహస్యత్రయముపదేశించెను. అంతట నా శఠగోపులు మధురకవులకుపదేశించెను. పిమ్మట శ్రీసేనేశులు శ్రీకులశేఖర, భట్టనాథ తొండరడిప్పొడి, తిరుప్పాణి, తిరుమంగయాళ్వార్లకుపదేశించెను.

౪ తదనంతరంబు॥ శ్లో॥ పునశ్శ్రీనాథమునయే పంచసంస్కారపూర్వకం। భట్టనాథప్రభృతిభిః నిర్మితైర్దివ్యసూరిభిః। దివ్యైర్వింశతిసంఖ్యాకైః ప్రబంధైస్సహ దేశికః। సర్వ స్త్రద్రామిడవేదానాం చతుర్ణాముపదేశకృత్॥ తిరిగి శ్రీమన్నాథమునులకు పంచసంస్కారపూర్వకముగా శ్రీభట్టనాథులు మొదలగు దివ్యసూరులచే నిర్మితములగు వింశతిసంఖ్యగల దివ్యప్రబంధములతో గూడ, దాము (శ్రీశఠగోపులు) పాడిన నాల్గు ద్రావిడవేదములను శ్రీమన్నారాయణుడు శ్రీశఠగోపులద్వారా నుపదేశించెనుసుమారి శ్రీశఠగోపులు శ్రీమన్నాథమునులకీరహస్యత్రయోపదేశ మొనర్చెను.

౫ తదనంతరం బావిధంబున శ్రీమన్నారాయణుండు శ్రీమన్నాథమునులద్వారా ఉయ్యకొండారులను శ్రీపుండరీకాక్షులకీ రహస్యత్రయోపదేశ మొనర్చెను.

౬ పిదప శ్రీమన్నారాయణుండు శ్రీపుండరీకాక్షులద్వారా మణక్కాలనంబియను శ్రీరామమిశ్రులకీరహస్యత్రయోపదేశ మొనరించెను.

౭ తరువాత శ్రీమన్నారాయణుండు శ్రీరామమిశ్రులద్వారా శ్రీయాళవందారులను శ్రీయామునాచార్యులకీరహస్యత్రయముపదేశించెను.

౮ తదనంతరంబు, శ్రీమన్నారాయణుండు శ్రీయామునాచార్యులద్వారా పెరియనంబియను పూర్ణాచార్యులకీరహస్యత్రయోపదేశ మొనరించిరి.

౯ తదుపరి శ్రీమన్నారాయణుండు పూర్ణాచార్యులద్వారా శ్రీమద్రామానుజస్వామికీరహస్యత్రయముపదేశించెను.

౧౦ తదనంతరంబున పేర్కొనిన శ్రీమన్నారాయణుండు శ్రీరామానుజస్వామిద్వారా కూరత్తాళ్వార్లకును మొదలియాండాన్ మొదలగు ౭౪ యాచార్యులకును ఎంబార్, అను

శాశ్వప్పాకమాళింబెరుమానార్ మొదలగు 200 జియ్యరులకును నింకననేకమంది శ్రీవైష్ణవులకును నీక్రమముదప్పక యీరహస్యత్రయోపదేశమొసర్చి వఅల నావిధముననేనుడయవరులు దర్శనస్థాపనజేయుసమయంబున॥ శ్లో॥ ప్రత్యేకప్పృథక్పృథక్ శిష్యాః ప్రణమేదీశ్వరాన్తదిస్వాచార్యం యావదాజ్ఞాతుంవాక్యంతావదనుస్మరేత్॥ స్వాచార్యులు మొదలు శ్రీమన్నారాయణునివఱకు తెలసినంతవఱకు నాచార్యపరంపరవాక్యమును వేరువేరుగా శిష్యుడు ప్రీతితోననుసంధింపవలెను॥ శ్లో॥ ప్రత్యహంప్రణతైశ్శిష్యైః ప్రభాతేపద్మసంభవ। తద్యథావిధినానిత్యంప్రసక్తవ్యంగురోస్సదా॥ ఓబ్రహ్మదేవుడా ఎల్లప్పుడు ప్రతిదినమున,నుదయమందు శిష్యుడుదణ్ణముసమర్పించి గురుకులమునుయథావిధిగా ననుసంధించవలెనని చెప్పినట్లు అస్మద్గురుభ్యోనమః అస్మత్పరమగురుభ్యోనమః అస్మత్సర్వగురుభ్యోనమః యనువేదోక్తములగు నీమూడువాక్యములతో శ్రీమతేరామానుజాయనమః శ్రీపరాంకుశదాసాయనమః శ్రీమద్యామునమునయేనమః శ్రీరామమిశ్రాయనమః శ్రీపుండరీకాక్షాయనమః శ్రీమన్నాథమునయేనమః శ్రీమతేశఠగోపాయనమః శ్రీమతేవిష్వక్సేనాయనమః శ్రియైనమః శ్రీధరాయనమః యనునీపదివాక్యములజేర్చి పదమూడువాక్యములుగాజేసి యీవాక్యగురుపరంపరను ప్రతిశ్రీవైష్ణవుడును ప్రతిదినంబునను ముఖ్యముగాననుసంధించును దననాశ్రయించిన వారికుపదేశింపవలయునని శాసించిరి. ఈక్రమమున నేనుడయవరులును కూరత్తాళ్వార్లకునియమించి చేతనస్వరూపమును జిగుర్పజేసి, పుష్పింపజేసి ఫలించునట్లుజేసి (శెల్వనాయతుళక్కు [illegible] ముదమాయు) సంపత్తుగలవాడై చలనములేని యానందామృతస్వరూపుడై యనియును,విజ్వరప్రముమోదహ॥ "పోయినతాపముగలవాడై యానందించె"ననునట్లు శ్రీమన్నారాయణుడు ప్రాప్తాపముదీరిసుఖించుచుండెను.

శ్లో॥ అన్వయాదపిచైకస్య సమ్యగ్జ్ఞస్యాత్మనోహరౌ। సర్వఏవప్రముచ్యేరన్ నరాః పూర్వేపరాతథా॥ శ్రీహరియందు లెస్సగామనస్సుంచిన (న్యస్తభరుడైన) నొక్కనిచేతమని సంబంధమువలన నాభగవత్సంబంధముగలమనుజుని వంశమందలి పూర్వులును పరులునుఅందరును మోక్షమునుపొందగలరు అనియును॥ అర్వాంచోయత్పదసరసిజద్వంద్వమాశ్రిత్య పూర్వేమూర్ధ్నాయస్యాన్వయముపగతాః దేశికాముక్తిమాప్తాః సోయంరామానుజమునిరపిస్వీయముక్తింకరస్థాం యత్సంబంధాదమనుతకథం వర్ణ్యతేకూరనాథః॥ అర్వాచీనాచార్యులు అనగా శ్రీరామానుజాచార్యులతర్వాత అవతరించిన,మనకు (పూర్వాచార్యులు)యేరామానుజులవారియొక్క పాదపద్మద్వంద్వములనాశ్రయించియు శ్రీరామానుజాచార్యులవారికి పూర్వమందవతరించినయాచార్యులు ఏరామానుజులవారి తిరుముడిసంబంధమనగా శ్రీరామానుజాచార్యసంబంధముగల్గి ముక్తినిబొందిరో అట్టిశ్రీరామానుజులవారును ఏకూరేశులసంబంధముచే స్వకీయముక్తిని కరస్థముగదలచిరో అట్టికూరనాథులనెట్లువర్ణింపశక్యమనునట్లు శ్రీరామానుజులవారి పూర్వదేశికులకును తర్వాతదేశికులకును సమానముగాను

ద్ధారకులగు నుడయవరులు సర్వజ్ఞులైనను॥ తథాపి సమయాన్ సర్వాన్ స్థాపయన్ సాంప్రదాయకం॥ అట్లయినను సమస్తపదార్థములను సాంప్రదాయికముగా స్థాపించుచున్న మతమునకు సత్సంప్రదాయపరిశుద్ధిగలదను నంశము దోచుటకు గాను అస్మద్గురుభ్యోనమః। అస్మత్పరమగురుభ్యోనమః। అస్మత్సర్వగురుభ్యోనమః। యని యనుసంధించిరి.

౧. అస్మత్ గురుభ్యోనమః యను వాక్యమునకర్థము. అస్మత్=నాయొక్క, గురుభ్యః = గురువులకొరకు, నమః=నమస్కారము. ఇందలి గురుశబ్దమునకర్థము. శ్లో॥ గుశబ్దస్త్వంధకారస్స్యాత్ రుశబ్దస్తన్నిరోధకః। అంధకారనిరోధత్వాత్ గురురిత్యభిధీయతే॥ "గురు" అనుశబ్దమందలి (గు) యనునక్షరమునకర్థము చీకటియనియు (రు) యనునక్షరమునకర్థము చీకటినిపోగొట్టు వస్తువనియును జెప్పబడినది. శిష్యునియజ్ఞానమను చీకటిని గురువు తనజ్ఞానోపదేశమను వెలుతురుచే పోగొట్టువాడగుటచే గురువనిపిలువబడెను. ఇందలి గురుశబ్దము గురుభ్యః యని చతుర్థిబహువచనము ప్రయోగింపబడినది. ఇందలి బహుగురువులెవరన, బ్రహ్మవిద్యాభ్యాసమునకు ముఖ్యమగు పంచసంస్కారములు జేసినవారు ప్రథమ గురువులనియు, బ్రహ్మవిద్యాభివృద్ధికి గావలసిన నితరోపదేశముల జేసినవారు గూడ గురువులేయనియును బహువచనార్థము గ్రహించునది. గౌరవార్థముగా బహువచనము ప్రయోగింపబడినదని కొందరి యభిప్రాయము.

౨. అస్మత్ పరమగురుభ్యః నమః యనువాక్యమునకర్థము. అస్మత్=నాయొక్క, పరమగురుభ్యః=పరమగురువులకొరకు, నమః=నమస్కారము. పరమగురువులనగా నాగురువులకుగురువులు. పరమగురువులనగా అత్యంతపాపిష్ఠుడనగు నన్ను ప్రపన్నునిగా జేయగల సమర్థతగలుగునట్లుగా నాగురువులకు జ్ఞానోపదేశము జేసినవారు గనుక పరమ గురువులని జెప్పబడిరి.

3. అస్మత్ సర్వగురుభ్యః నమః యనువాక్యమునకర్థము. అస్మత్=నాయొక్క, సర్వగురుభ్యః సర్వగురువులకొరకు, నమః=నమస్కారము. సర్వగురువులనగా నాగురువుల గురువులకు గురువు లనియును నాకుజ్ఞానోపదేశము జేసిన గురువులయొక్క గురువులకు తగిన జ్ఞానోపదేశము జేసినవారుగాన సర్వగురువులనియును జెప్పిరి. తనకు బ్రహ్మవిద్యోపదేశమునకు సహకారులగు పెద్దలందరునని గ్రహించునది.

౧. శ్రీమతే రామానుజాయనమః శ్రీరామానుజులవారి కొరకు నమస్కారమని యర్థము. వీరు రామానుజమతస్థాపకులు. వీరు పెరియనంబిగారి శిష్యులు. శ్రీరామానుజులవారి పూర్వాపరవంశజులు పెరియనంబిగారి పూర్వాపరవంశజుల నాశ్రయించలేదు. శ్రీరామానుజులవారు మాత్రమే పెరియనంబిగారి నాశ్రయించిరి గనుక శ్రీరామానుజులవారికి యాచార్య పరంపరతనియలే గాని యాచార్యవంశపరంపరతనియలు లేవు.

౨. శ్రీపరాంకుశదాసాయనమః. శ్రీపరాంకుశదాసునికొఱకునమస్కారము. వీరికి పెరియనంబియనియు పూర్ణాచార్యులనియుఁగూడ పేళ్లుగలవు. వీరు శ్రీయామునాచార్యుల వారికి శిష్యులు. పెరియనంబిగారి పూర్వాపరవంశజులు శ్రీయామునాచార్యులవారిపూర్వాపరవంశజుల నాశ్రయించలేదు. పెరియనంబిగారు మాత్రమే శ్రీయామునాచార్యుల వారి నాశ్రయించినారు గాన వీరికిని యామునాచార్యవంశపరంపర తనియాలు లేవు.

౩. శ్రీమద్యామునమునయేనమః. శ్రీమత్ యామునమునికొఱకు నమస్కారము. వీరికి ఆళవందారులనిగూడ పేరుగలదు. వీరు శ్రీరామమిశ్రులవారిశిష్యులు. ఈగురుశిష్యులిద్దరికిని వంశపరంపరసంబంధము లేదు.

౪. శ్రీరామమిశ్రాయనమః. శ్రీరామమిశ్రులకొఱకునమస్కారము. వీరికిమణక్కాలనంబియనిగూడ పేరుగలదు. వీరుశ్రీపుండరీకాక్షుల శిష్యులు. ఈగురుశిష్యులిద్దరికిని వంశపరంపరసంబంధమేమియును లేదు.

౫. శ్రీపుండరీకాక్షాయనమః. శ్రీపుండరీకాక్షులకొఱకునమస్కారము. వీరికి ఉయ్యక్కొండారులనిగూడ పేరుగలదు. వీరు శ్రీమన్నాథమునులశిష్యులు. ఈగురుశిష్యులిద్దరికిని వంశపరంపర సంబంధమేమియును లేదు.

౬. శ్రీమన్నాథమునయేనమః. శ్రీమన్నాథమునులకొఱకునమస్కారము. వీరు శ్రీశఠగోపులశిష్యులు. శ్రీశఠగోపులు శూద్రకులజులు. ఈగురుశిష్యులిద్దరికిని వంశపరంపరసంబంధ మెంతమాత్రములేదు. శ్రీమన్నాథమునులకు నాచార్యవంశతనియాలేలేవు.

౭. శ్రీమతేశఠగోపాయనమః శ్రీశఠగోపులకొఱకు నమస్కారము వీరికి శ్రీనమ్మాళ్వారులను మొదలగు నామాంతరములు గలవు వీరు శ్రీవిష్వక్సేనులశిష్యులు శ్రీశఠగోపులు నరావతారులు శ్రీవిష్వక్సేనులు నిత్యసూరులు అనగా దేవతలు వీరియువురికిని వంశపరంపరసంబంధ మెంతమాత్రములేదు.

౮. శ్రీమతేవిష్వక్సేనాయనమః శ్రీవిష్వక్సేనులకునమస్కారము వీరునిత్యసూరులు వీరు పెరియపిరాట్టి శిష్యులు.

౯. శ్రియైనమః శ్రీలక్ష్మీదేవికొఱకు నమస్కారము ఈమె తమభర్తయగు శ్రీమన్నారాయణుని నాశ్రయించెను.

౧౦. శ్రీధరాయనమః శ్రీధరులకొఱకు నమస్కారము శ్రీధరులగు శ్రీమన్నారాయణులే ప్రథమాచార్యులు.

పైవాక్యగురుపరంపరసరణినిబట్టి విచారించగా శ్రీరామానుజాచార్యులవారి పూర్వాచార్యులందరు ముఖ్యముగా జ్ఞానానుష్ఠానములుగల నాచార్యులనే నాశ్రయించినట్లు గనుపడుచున్నదిగాని జ్ఞానానుష్ఠానములు లేకున్నను యాచార్యవంశపరంపరయే ముఖ్యమని యాశ్రయించినట్లు స్పష్టమైనది.

సంసారమను సర్పముచే గరువబడిన జీవులకు ప్రాణరక్షకు లగునట్టియు, గురువులగు నట్టియు, లోకాచార్యులకొఱకు నమస్కారమని వీరితనియార్థము॥ వీరు వడక్కుతిరువీధి పిళ్ళైగారి శిష్యులును, కుమారులునై యున్నారు. వీరు పరమవిరక్తులు, వీరు తెంగల వారికత్యంతాభిమానమగు శ్రీవచన భూషణము మొదలగు రహస్యముల సాయించి పరమైకాంతులై ప్రపన్నగోష్ఠి నలంకరించిరి. వీరికాలమునుంచియే తెంగల సంప్రదాయ మభివృద్ధి గాంచినది.

౨. తిరువాయిమొழிపిళ్ళై గారు. శ్లో॥ నమః శ్రీశైలనాథాయ కుంతీనగరజన్మనే ప్రసాదలబ్ధ పరమ ప్రాప్యకైంకర్య శాలినే॥ భగవత్ప్రసాదమువలన పొందిన భగవత్కైంకర్యమందు సమర్థులగునట్టియు, కుంతీనగరవాసు లగునట్టియు, శ్రీశైలనాథులకొఱకు నమస్కారమని వీరి తనియార్థము. వీరు నాగపట్టణ నివాసులు, అణ్ణర్ గారి కుమాళ్ళు, పిళ్ళైలోకాచార్యులవారి శిష్యులు వీరుతమ జ్ఞానానుష్ఠానములచేత పిళ్ళైలోకాచార్యుల వారి తర్వాత దర్శన స్థాపకులైరి గాని వారసత్వముచే దర్శనస్థాపకులు కాలేరు.

౩. మణవాళ మహామునులు. శ్లో॥ శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవం యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిం॥ శ్రీశైలేశుల దయకు పాత్రులగు నట్టియు, బుద్ధి, భక్తి, మొదలగు గుణములకు సముద్రులైనట్టియు, యతీంద్ర ప్రవణు లగునట్టియు, రమ్యజామాతృలను మణవాళ మహామునులగూర్చి నమస్కరించుచున్నానని వీరి తనియార్థము. వీరు నాగపట్టణనివాసులు తిరునావీఱుడైయపిరాన్ దాసణ్ణర్ గారి తనయులు తిరువాయిమొழி పిళ్ళై గారి శిష్యులు. వీరు పరమ విరక్తులు, వీరు శ్రీపిళ్ళై లోకాచార్యులవారు సాయించిన తిరుమంత్రార్థము మొదలగు రహస్యములకు వ్యాఖ్యానముల సాయించిరి. వీరుకూడ యాదిశేషుల యుపరావతారమని తెంగలవారి నమ్మకము, వీరుతమ జ్ఞానానుష్ఠానములచేతనే దర్శన స్థాపకులైరిగాని వంశపారంపర్యపు వారుకచే దర్శన స్థాపకులు గాలేదు. పూర్వాచార్య పరంపరతనియులు వీరి తనియతో పూర్తియైనవి. వీరితనియ తర్వాత తెంగలవారికందరికి పొత్తైన తనయులు లేవు.

౧. శ్రీరామానుజులవారు ప్రథమవాక్య త్రయమను సంధించునపుడు అస్మద్గురుభ్యోనమః యనువాక్యమందలి గురుశబ్ద బహువచనముచే ప్రతిపాదింపబడువారిలో ప్రథమాచార్యులు పెరియనంబియును, బహువచన ప్రతిపాద్యులు. తిరుక్కచ్చినంబి, పేరరుళాళప్పెరుమాళ్ (శ్రీవరదరాజస్వామి) తిరువరంగప్పెరుమాళ్ రయరు, మొదలగువారును ఇట్లే గురుశబ్దబహువచనమున కాయాస్థలములం దర్థము గ్రహించునది.

అస్మత్పరమ గురుభ్యోనమః యను ద్వితీయవాక్యమును సంధించునప్పు డిందలి గురుశబ్దబహువచనముచే ప్రతిపాదింపబడువారు, ఆళ్వందారులును, యాయాళ్వందారుల

యొక్క సబ్రహ్మచారులునునై యుండిరి. అస్మత్సర్వగురుభ్యోనమః యను తృతీయ వాక్యమును సంధించునప్పు డందలి సర్వగురుశబ్ద బహువచనముచే బ్రతిపాదింపబడువారు శ్రీరామమిశ్రులు (మణక్కాలనంబి) మొదలు వీరిపైవారందరగునని గ్రహించునది.

౨. పైనచెప్పిన రీతినే నడయుచుండు పూర్వుల గురుదేశికులలోను దయవరులగు ప్రథమాచార్యులగునట్టి పెరియనంబివాక్యత్రియమును సంధించునప్పుడు ప్రథమవాక్యమందలి గురుశబ్దబహువచన ప్రతిపాద్యులు ఆళవందారులును, వీరిసబ్రహ్మచారులునై యుండిరి. రెండవ వాక్యమందలి గురుశబ్ద బహువచన ప్రతిపాద్యులు శ్రీరామమిశ్రులును నీపెరియనంబిగారికి సమాపసక్తియందు రుచిగలుగజేసిన శ్రీవైష్ణవులును నాశ్రీవైష్ణవులతో సంబంధము గలుగజేసిన శ్రీమన్నారాయణుండునై యుండిరి. మూడవవాక్యమందలి సర్వగురుశబ్ద బహువచన ప్రతిపాద్యులు శ్రీపుండరీకాక్షులు మొదలు శ్రియఃపతి పర్యంతముగలవారందరునై యున్నారు.

3. ఆచేప్రకారముగ నాళవందారు లీవాక్యము లనుసంధించునప్పు డందలి మొదటివాక్యములోని గురుశబ్దబహువచన ప్రతిపాద్యులు శ్రీరామమిశ్రులును, వీరికి ప్రపదనమందు రుచిగలుగజేసిన పరమభాగవతులును, శిష్యులందరునై యుండిరి. రెండవ వాక్యమందలి గురుశబ్ద బహువచన ప్రతిపాద్యులు, శ్రీపుండరీకాక్షులును, వీరికిప్రపదనమందు రుచిగలుగజేసిన పరమభాగవతులును శిష్యులునునై యుండిరి. మూడవవాక్యమందలి సర్వగురుశబ్ద బహువచన ప్రతిపాద్యులు శ్రీమన్నాథమునులు మొదలు శ్రీధరుని పర్యంతముగలవారని గ్రహించునది.

౪. ఆవరుసనే (మణక్కాలనంబి) శ్రీరామమిశ్రులీవాక్యత్రియమును సంధించునప్పుడిందలి ప్రథమవాక్యములోని గురుశబ్ద బహువచన ప్రతిపాద్యులు (ఉయ్యక్కొండార్) శ్రీపుండరీకాక్షులును వీరికి విషయమందు విశ్వాసముపుట్టించిన శ్రీవైష్ణవులును, యాచార్యులందరునై యుండిరి. ద్వితీయవాక్యమందలి గురుశబ్ద బహువచన ప్రతిపాద్యులు, శ్రీమన్నాథమునులును వీరికీవిషయమందు రుచిగలుగజేసిన పరమభాగవతులును శిష్యులందరునై యుండిరి. తృతీయవాక్యస్థ సర్వగురుబహువచన ప్రతిపాద్యులు శ్రీమన్నమ్మాళ్వారు మొదలగువారని గ్రహించునది.

౫. ఆవిధముననే శ్రీపుండరీకాక్షు లీవాక్యత్రియమును సంధించునప్పు డీవాక్యములలోన ప్రథమవాక్యమందలి గురుశబ్ద బహువచన ప్రతిపాద్యులు శ్రీమన్నాథమునులును వీరికీవిషయమందభిరుచి గలుగజేసిన పెద్దలును, ఎంబెరుమానునై యుండిరి. ద్వితీయ వాక్యస్థ బహువచన ప్రతిపాద్యులు శ్రీమన్నమ్మాళ్వారును, ఎంబెరుమానునై యుండిరి. తృతీయవాక్యస్థ సర్వగురు బహువచన ప్రతిపాద్యులు సేనమొదలియారు మొదలగు పైవారందరునని గ్రహించునది.

మానుజన్తాళ్ పడిత్తార్ పిడిత్తారై పత్తి) శ్రీరామానుజతిరువడినాశ్రయించిన వారినాశ్రయించియనురీతిని పైపైనజేగిర్చి పాకివ్యాపింపసమర్థమైనదగుటచే నంబిళ్ల తిరువడినాశ్రయించిన వడక్కుత్తిరువీధిప్పిళ్ళైయును, వారితిరువడినాశ్రయించిన పిళ్లలోకాచార్యులును, వారిపాదపద్మములనాశ్రయించిన తిరువాయిమొళిప్పిళ్లెగారును, వారియడుగుదమ్ములనాశ్రయించిన పెరియజీయ్యర్ (మణవాళమహామునులును) నీవాక్యత్రయమనుసంధింపుమనప్పుడింటలిగురు, పరమగురు, సర్వగురుశబ్దబహువచన ప్రతిపాద్యులు వీరు వీరు యనునంశము, ఆయాయాచార్యులను, యాయాచార్యులకుప్రాణపదులై బహుమాన్యులై తీగకునాధారమైనపాకుపందిరివలె నైనచెప్పినయాచార్యులనాశ్రయించు వారిని వారి తిరువడిపళ్లలోశ్రీశ్రీవైష్ణవులని యును దెలియనగును.

౧ శ్రీమతేరామానుజాయనమః ఈవాక్యములో శ్రీమతేయనుశబ్దము సవిభక్తికమతుప్

౨ శ్రీపరాంకుశదాసాయనమః ఇందలి శ్రీ శబ్దము మతుప్ప్రత్యయరహితము.

౩ శ్రీమద్యామునమునయేనమః ,, శ్రీమత్ శబ్దములు ప్రవిభక్తికమతుప్.

౪ శ్రీరామమిశ్రాయనమః ,, శ్రీశబ్దము మతుప్ప్రత్యయరహితము.

౫ శ్రీపుండరీకాక్షాయనమః ,, ,, ,,

౬ శ్రీమన్నాథమునయేనమః ,, శ్రీమత్ శబ్దములు ప్రవిభక్తికమతుప్.

౭ శ్రీమతేశఠగోపాయనమః ,, శ్రీమతేశబ్దము సవిభక్తికమతుప్

౮ శ్రీమతేవిష్వక్సేనాయనమః ,, ,, ,,

౯ శ్రియైనమః యనువాక్యములో (శ్రీరితిప్రథమాభిధానంలక్ష్మ్యాః) శ్రీయనుశబ్దము లక్ష్మీదేవికి మొదటి పేరనియును) శ్రీరిత్యేవచనామతే, (నీకుశ్రీయనియే పేరుగదా! యనియు చెప్పుటచే శ్రీశబ్దము పెరియపిరాట్టియారకు పేరై యున్నది.

౧౦ శ్రీధరాయనమః యను వాక్యములో (శ్రియంధరతీతిశ్రీధరః) యనియోగవ్యుత్పత్తిచే నెంబెరుమానుకు తిరునామమై యున్నది.

చివరరెండువాక్యములు గాక మిగిలిననెనిమిదివాక్యములలో శ్రీశబ్దము (నజ్ఞానవతు ల్యంకథమస్తికించిత్) జ్ఞానముతో సమానమగునది మరియొకటియేదియు లేదని యును (భగవద్భక్తిరేవాత్రప్రపన్నానాంమహద్ధనం) ప్రపన్నులకీలోకములో భగవద్భక్తియే గొప్పధనమని చెప్పుటచే జ్ఞానభక్తులను మహాసంపదలకువాచకమై యున్నది.

ఈవాక్యగురుపరంపరలో శ్రీశబ్దము కొన్ని వాక్యములలో సవిభక్తికమతుప్ప్రత్యయోపేతమై కొన్ని వాక్యములలోను ప్రవిభక్తికమతుప్ప్రత్యయోపేతమై, కొన్ని వాక్యములలో మతుప్ప్రత్యయరహితమై యున్నది. శ్రీశబ్దమిట్లు వైరూప్యముగా నిర్దేశించుటకు గారణము కొందరి జ్ఞానభక్తులు విశదతమములై, కొందరిజ్ఞానభక్తులు విశదతరములై, కొందరిజ్ఞానభక్తులు విశదములై యుండుటచే, నిట్లు నిరూపణజేయబడినది.

అడియొట్లన పద్మవాసినియగు శ్రీలక్ష్మీదేవితిరువడిత్తా మరలనాశ్రయించిన సేనముదలియార్లయొక్కయు వారితిరువడిషుళ్లయుందుండు మాలికలను శిరస్సునధరించిన శ్రీమన్నమ్మాళ్వార్లయొక్కయు వారితిరువడినాశ్రయించియు జీవించినయుడయవరులయొక్కయు జ్ఞానశక్తులు విశదతమములై యున్నవి.

శ్రీమన్నమ్మాళ్వారికత్యంతాంతరంగులగు శ్రీనాథమునులయొక్కయు, తద్వంశయీశ్వరపౌత్రభూతులగు శ్రీయామునాచార్యులవారియొక్కయు జ్ఞానశక్తులు విశదతరములై యున్నవి.

మిక్కిలిబుద్ధిశాలులగు నాథమునులమహాత్మ్యమును బాగెరుంగుచుండు శ్రీపుండరీకాక్షులయొక్కయు వారిశిష్యులగు శ్రీరామమిశ్రులయొక్కయు, వారిప్రశిష్యులగు పెరియనంబి (పూర్ణాచార్యులు) యొక్కయు, జ్ఞానశక్తులు విశదములై యున్నవి.

వీరలజ్ఞానశక్తులు సమానముగానుండక యెమ్పెరుమానార్లుగానుండుటకు కారణమేమన శ్రీసేనముదలియార్లయొక్కయు శ్రీమన్నమ్మాళ్వార్లయొక్కయు జ్ఞానశక్తులు (విష్వక్సేనసంహితయందు ప్రపత్తిమార్గమునుగూర్చి విశేషముగా గనపరచుటచేతను ప్రపత్తినంగీకరించు ప్రపత్తవ్యులు) నెంజెమిమానమార్గముల యాథార్థ్యతనందరికి దెలియజేయుటచేతను ఆప్రకారముగా శ్లో॥ ప్రియే రసేనాపతినా నివేదితం తథానుజానంతము దారవీక్షణైః॥ ప్రియులకు సేనాపతిచె దెలియజేయబడిన కార్యము నాలాగుననే జేయవలసినదని, శ్రీమన్నారాయణుని గంభీరకటాక్షములచే ననుజ్ఞనొసగువాడని బుద్ధిమంతులు జెప్పినట్లుభగవంతునిముఖోల్లసద్వీన తిరువాయిమొళ్ము లమగ (లెక్కస్థానతాళ్ నిల్ లిలే, తిరుశ్రీపాదములనీడవాశొనగను. (కల్ కళిస్థ మత్తోర్ కళైకణ్ణిలజ్ఞానిక్కె, మీశ్రీపాదములుతప్ప వేరొకరక్షకములేనివాడనుసుమీ విచారించుడి (అడిక్కీల్ప్ఱమర్న్ద పురుడర్కనే) తిరువడిషుళ్లిళౌనమరినట్లు ప్రవేశించెదను, యనిప్రపత్తిమార్గము ననేకవిధములుగా తమ శ్రీసూక్తిస్థానములచే స్పష్టపరచుటచేతను (ఉయ్యర్వోవుయర్నలముడయవన్ మయర్వామదినలమరుళినన్) సర్వోత్కృష్టమగునట్టియు, వృద్ధినొందునట్టియు, జ్ఞానానందముల కృపజేసినాడు అనునట్టియు అజ్ఞానమును నశింపజేసి భక్తిరూపాపన్న జ్ఞానమును గృపజేసినవాడును, కణ్ణన్ తే వరుక్కంతేవా. ఆశ్రిత సులభుడా దేవదేవుడా, యనియు ప్రపత్తవ్యుని స్వభావముల నెక్కువగా నవలంబించుటచేతను. ఉమ్మయిర్ పిడుడయాన్ (మీయాత్మలు నివాసముగాగలవాడును) యానేనీయెన్నుడమైయుంనీయే. నేనే నీవు అనగా నీవాడను నాసర్వస్వమునునీవే) తొండర్, తొండర్, తొండ్డన్ (దాసుల, దాసుల, దాసుడను) యని ప్రపన్నుని మార్గముల ననేక విధములుగా ప్రదర్శింపజేయుటచేతను "పేరమర్ కాదల్ కడల్ పురయవిళైత్తు" గొప్పగా అమరియున్న నా ప్రేమసముద్రమును మ్రింగినట్టు వృద్ధి నొందినది. "కొండవెన్ కాదలురైక్కిత్తోళ్ప్" (సఖీ;



స్వీకరించిన నాథశక్తిని జెప్పినట్లయిన) "మణ్ణినై జ్ఞాలము మేఘ్రుం కడలుమ్ నీళ్ విశుంబు మట్రుమ్ యఱ్ఱైవుత్తాళ్" మట్టినో నిండినభూమిని సప్తసముద్రములను అపరిచ్ఛిన్నమగు నాకాశమును నతిక్రమించునట్లు పెద్దదిగనా) "శేఱ్ఱుయందతనిల్ పెరియువెన్నావా" అంతట వ్యాపించియుండు తత్త్వత్రయముకంటె నాయభిని వేళము పెద్దదిగనా) యనియు పిరాట్టిమార్ శ్రీసూక్తిచేతను (శ్రీసేనముదలి, శ్రీమన్నమ్మాళ్వార్ల (శ్రీసూక్తులచేతను (పిరాట్టి, శ్రీసేనముదలి, శ్రీమన్నమ్మాళ్వారు) తమవిశ్లేషాసహిష్ణుతను శ్రీమన్నారాయణునికి దెలియజేయుటచేతను (శ్రీసేనముదలి, శ్రీమన్నమ్మాళ్వార్ల, జ్ఞానభక్తులు) విశదతమములై యున్నవి.

ఉడయవరులజ్ఞానభక్తులను (భవతుమమపరస్మిన్ శేముషీభక్తిరూపా) (భక్తిరూపమగు నాబుద్ధిపరునియందుండునుగాక) యనియుడయవరులును (అచ్యుతపదాంబుజయుగ్మరుక్మవ్యామోహితః) శ్రీమన్నారాయణునిపాదపద్మద్వయమను బంగారునందు వ్యామోహముగలవారని) కూరత్తాళ్వారనుసాయించినట్లుండునవియు, గద్యత్రయ, శ్రీభాష్యముల ద్వారాశరణాగత, భక్తిశాస్త్రముల, గ్రమముగాప్రకటించుటచేతను (అవ్వుళ్ళియల్ మరైయిఱ్ఱేరాతవరై చ్చిత్తై ప్పతిప్పదాయశిన్దైశెదే) శాస్త్రవిశ్వాసములేని వారినాశమును చింతించుమన్నాడనునట్లు దమతాదాత్మిక ప్రతిభచేప్రతివాదియను నేనుగుయొక్క ప్రకటాటోపమునశింపజేయుటచేతను శూడికుడుత్తనాంచారు కోరినటుల నూఱుబిందెల వెన్నతోనూరుబిందెలనిండా యక్కారడిశలను తిరుమాలిరుంశోలలో వేంచేసియుండుపరమస్వామియగునళగరి (సుందరబాహుస్వామికి) నారగింపుసమర్పించికృతజేయుటచేతను.

మరియునుడయవరులు స్వయముగానేతురుష్కనిపట్టణమగుడిల్లికిజని, తురుష్కనిపుత్రికగృహమందున్న శ్రీరామప్రియులసేవించి) మంగళమగుగాక. మంగళమగుగాక, నీకెక్కడమంగళమగుగాక, ఓవామననంబీనీవిచ్చటికిరా, యనియునునీలకుంతలములతోను. సెట్టినియథగోష్ఠముతోను గూడినముఖముగలనాకారుస్థనంబీ, యిచటకురాయనునిత్యాదిభక్తి ప్రభావములచే శ్రీరామప్రియులు, యుడయవరులున్నచోటికే వేగముగాబయగత్తుకొనిరాగా, నాశెల్వపిళ్ళారాయనివారికి (శెల్వపిళ్ళ) యనుతిరునామమొసగి, వారి నాలింగనముజేకొనుటచేతను.

మెండియు మేరుకోటలో తిరుక్కళ్యాణిగట్టున వేంచేసియున్న నుడయవరుల సన్నిధికి శ్రీరంగమునుంచి మారొనిల్లామారుతియాండాన్ వచ్చి క్రిమికంఠుడు నశించిన వృత్తాంతము విన్నవించగా, నుడయవరులు విని, మిక్కిలి సంతోషముతో, వేకచ్ఛత్రాధిపతియగుతిరువరంగచ్చెల్వపెరియపెరుమాళ్ళకుమంగళాశాసనముజేయ, గోయిలకు (శ్రీరంగమునకు) వేంచేయుపుడు నుడయవరులవటి శెల్వపిళ్ళ సన్నిధిలో నేబదిరెండుకైంకర్యములుజక్కగజరుగునట్లేర్పరచి, యాకైంకర్యములందు బ్రివర్తించునటుల గొందరిని

నియమించుటచేతను, గట్లు పొర్లి ప్రవహించు కావేరి జలమువలె, పొంగి భగవద్విషయమును నాశ్రయించడమేగాక, భగవద్విషయమందాభిముఖ్యము గల్గియుండుట కుపయుక్తమైయుండుటచేతను, విశదతమములై యున్నవి.

శ్రీమన్నాథమునులయొక్కయు, ఆళువందారులయొక్కయు జ్ఞానభక్తులిచ్చట నే విశ్రమించి గట్లుపొర్లి పొంగక సగము నీటితో నిండిన, నదిపట్టువలె, తామాశ్రయించినచోటనే నడగియుండియొకటి రెండు ప్రబంధముల సాయించుట కుపయుక్తములై యుండుటచే విశదతములై యున్నవి.

ఉయ్యక్కొండార్, మణక్కాలనంబి, పెరియనంబులయొక్క జ్ఞానభక్తులు పైన జెప్పిన ప్రకారము గాకుండ, సాననీటి పాయదలగల, నదిపట్టువలె, పరిమితములై యుండుట చేత విశదములై యున్నవి.

ఈరీతిని పదమూడువాక్యములలో మొదటిమూడువాక్యములు వేదశాస్త్రసంప్రదాయపరిగృహీతములై యున్నవి.

అపౌరుషేయమును, పౌరుషేయము, నగు రహస్యత్రయమునకే కావయవిత్వము జెప్పినట్లు, పౌరుషేయాపౌరుషేయములగు నీపదమూడువాక్యములకు నేకావయవిత్వము జెప్పుటకుసందేహములేదు. ఆక్రమముననే "నమఃఋషిభ్యః" యనునట్లునమశ్శబ్దపూర్వకము గానీవాక్యత్రయము నిర్దేశింపక, యస్మచ్ఛబ్దపూర్వకముగా నిర్దేశించినది (అఖిలభువన జన్మ) యను స్థలమందువలెనే మంగళోక్తమగు అకారోపక్రమత్వము సిద్ధించుటకుగాను జెప్పబడినది.

అవరుసనే మొదటివాక్యమందు అకారోపసిద్ధ్యర్థముగా అస్మచ్ఛబ్దమును మొదట ప్రయోగించినిర్దేశించినట్లు, మిగిలినరెండువాక్యములందుగూడ అస్మచ్ఛబ్దము నేముందుంచి నిర్దేశింపడమైనది (శన్నోమిత్రశ్శంవరుణః శన్నోభవత్వర్యమా) సూర్యుడుమనకుశుభము (శుభకరుడు) అగుగాక, వరుణుడు,(అర్యముడు) మనకు శుభము (శుభకరుడు) అగుగాక, యనునట్లుగా త్రయోదశవాక్యాత్మకమగు నీగురుపరంపరామాలారూపమంత్రము, శ్రీసహస్రనామమాలామంత్రమువలె, ననేకనమశ్శబ్దశరీరకమై ద్వ్యాగశేషులకును, క్రమముగా ప్రధానశేషులకును, ప్రతిపాదకమై ప్రథమ, మధ్యమ, చరమావధిరూపమగు పర్వత్రయప్రకాశకమై ఉపదేష్టృపదేశోపదేశ్య రూపమూడువర్గములకును సాంప్రదాయికత్వ, సాద్గుణ్య, యోగ్యతలకు సంపాదకమై (వక్తవ్యం గురుపరంపరయుం,ద్వయముం) యనునట్లుద్వయముతోపాటు సదానుసంధేయమై గురుపరంపరాపూర్వకముగా రహస్యత్రయమనుసంధించువారిని (నావకారియశ్శొల్లిలాదవర్) నాలుకయందసత్యోక్తి లేనివారనియును(మయర్వరమతినలమరుళ పెత్తార్) అజ్ఞానసంశయవిపర్యయగుభక్తియపాపన్నజ్ఞానమును కృపచేయగా

లభించినవారుగాని యాడునట్లుజేయదగినదియై, అస్మత్ అనిఅకారాది గానుపక్రాంతమై అప్రకారముగానేఅకార శ్రీమచ్ఛబ్దముల, ననేకచోట్లప్రిథమమందుగలదియై శ్రీధరాయ నమః, యనుమాంగళికమగు నమశ్శబ్దముతో నియమింపబడినదియై యుండుటచేతనునీ వాక్య గురుపరంపరయంతయుమంగళాత్మకమై యున్నది

## శ్రీరహస్యత్రయార్థము.

సద్గురూపదేశ పూర్వకముగా నన్నివర్ణముల స్త్రీపురుషులును పైన జెప్పినవాక్య గురుపరంపరాను సంధానానంతరం రహస్యత్రియమను సంధానము జేయవలయును, ప్రతి శ్రీవైష్ణవచేతనుడుపంచసంస్కారములలభించుకొనునప్పుడు పంచసంస్కారములలో నాల్గవది యగు రహస్యత్రయోపదేశమును పైనజెప్పిన త్రయోదశవాక్య గురుపరంపరావాక్య పూర్వకముగా యోగ్యుడగు నాచార్యునివద్ద నుపదేశమునొంది యనుదినమను సంధించుచుండవలెను. "ఆచార్యవాన్ పురుషో వేద ఆచార్యాద్ధైవ విద్యావిదితా సాధిష్ఠం ప్రాపయత్" (ఆచార్యునివలన నుపదేశమునొందినవాడే) (భగవంతుని) తెలసికొనును, ఆచార్యునివలననే విద్యతెలసికొనునది. ఆవిద్య విశేషముగా పొందుపబడును. యను ప్రిమాణముచే, నుపదేశము నొందక, యెవరును నీవాక్యగురు పరంపరాపూర్వకరహస్య త్రయమనుసంధించగూడదు. రహస్యత్రయమన

(ఓంనమోనారాయణాయ)యనుతిరుమంత్రమును

శ్రీమన్నారాయణచరణౌశరణంప్రపద్యే }
శ్రీమతేనారాయణాయనమః } యనుద్వయమును

సర్వధర్మాన్పరిత్యజ్యమామేకంశరణంవ్రజ }
అహంత్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామిమాశుచః } యను చరమశ్లోకము లైయున్నది.

ఇందలితిరుమంత్రిము బదరికాశ్రమమందు శ్రీమన్నారాయణుండు నరనారాయణావతారమెత్తి స్వాంశసంభూతుడగు నరునకునునారదాది పరమఋషులకునుపదేశించెను. ఓమ్ + నమః + నారాయణాయ. అనిమూడుపదములుగా జేయబడినది. ఓమ్ = భగవత్స్వరూపుడగు, నారాయణాయ = నారాయణుని కొరకు. నమః = నమస్కారము. అనగా శేషత్వమేస్వరూపముగలనేను నాకుపయుక్తుడను కాను, శ్రీమన్నారాయణునికొరకే సమస్త కైంకర్యములజేయువాడను అని తాత్పర్యము.

౧ ఈతిరుమంత్రిమందలి మొదటిపదమగు(ఓమ్) అను ప్రణవము. (అ + ఉ + మ్) లుఅనిమూడక్షరములుగా పదచ్ఛేదము చేయబడినది.

అందలి(అకారమునకర్థము. విష్ణు)(మ్ కారమునకర్థము జీవుడు)(ఉకారమునకర్థము ఏవకారము) (మ్) కారవాచ్యుడగుజీవుడు, (అ) కారవాచ్యుడగు శ్రీమన్నారాయణునికి (ఉ)కారవాచ్యమగు (ఏ) వకారార్థమనగా శ్రీమన్నారాయణునికేదాసుడనితాత్పర్యము.

౨. ఈతిరుమంత్రమందలి నమశ్శబ్దము, మొదటిపదమగు ప్రణవముతోను, స్వస్థానమందును, తర్వాతనుండు నారాయణపదముతోను, మూడువిధములుగా నన్వయింపబడినది. ఇందలి రెండవ పదమగు (నమః) అను శబ్దము,

౧. మొదటిపదమగు ప్రణవముతో నన్వయించునపుడు "న" అనియు, "మః" అనియు రెండుపదములుగా భాగింపబడి యన్వయించబడినది. అప్పుడు (ఓమ్ నమః) యని యన్వయించబడినది. ఓమ్, నమః, యను పదముల కర్థము. ప్రణవమందలి (మ్) కార వాచ్యుడగు జీవుడు, ఆప్రణవమందలి (అ) కారవాచ్యుడగు శ్రీమన్నారాయణునికే దాసుడుగాని (మః) మకారవాచ్యుడగు జీవుడనగు నాకు, (న) నేను దాసుడను కానని యర్థము.

౨. ఈతిరుమంత్రమందలి నమశ్శబ్దమును, యున్నచోటునందుంచియే యన్వయించునప్పుడు (నమః) యని యఖండముగాను (న + మః) యని సఖండముగాను, యన్వయించబడినది. దీనికర్థము. (నమః) రక్షణోపాయము. (మః) నాకు (న) లేదు, నారక్షణోపాయము. (మః) నాకు (న) లేదు, నారక్షణోపాయము శ్రీమన్నారాయణునికేగాని నాకు లేదని తాత్పర్యము.

3. ఈతిరుమంత్రమునందలి నమశ్శబ్దము, తర్వాతనుండు నారాయణ శబ్దముతో నన్వయించునపుడు (నారాయణాయ + న + మః) అని సఖండముగా నన్వయింపబడినది. దీనికర్థము. (నారాయణాయ) శ్రీమన్నారాయణునికొరకు సమస్తకైంకర్యములను జేయుచున్నాను. మః = నాకు, న = కాదని యర్థము.

3 ఈతిరుమంత్రమందలి మూడవదియగు చతుర్థీకవచన (నారాయణాయ) అను పదమునకర్థము, నారాయణపదమందలి "రింగ్" క్షయే యను ధాతువువలనగలిగినది "రః" అను శబ్దమునకు నశించునదియనియర్థము. తరువాత "ర"యను నక్షరమునకు "న" జేర్చుటవలన "నరః" అయినది. "నర" అను శబ్దమునకు నశించనిదని యర్థము. ఈ నరశబ్దము సమూహార్థము జెప్పునప్పుడు 'నారః' అయినది, నారః అనగా నశించని సమూహమని యర్థము. 'నారః' అను శబ్దమునకు బహువచనము 'నారాః' అయినది. నారాః అనగా నశించనివస్తుసమూహములయొక్క సమూహములనియర్థము. నారాణాం + అయనం. యః, సః = నారాయణః అనగా నారములకుస్థానము యెవడో వాడు నారాయణుడు అనితత్పురుష సమాసము జేసియర్థము జెప్పబడినది. నారాః అయనం, యస్య, సః = నారాయణః = నారములుస్థానము ఎవనికో వాడు నారాయణుడనియనబడును. అనిబహువ్రీహిసమాసము జేసి యర్థము జెప్పబడినది. నారాయణాయయను చతుర్థీకవచనమునకు శ్రీమన్నారాయణునికొరకు సమస్తకైంకర్యములావిర్భవించుగాక యనియర్థము. ఈచేతనుడు సర్వవ్యాపకుడగు శ్రీమన్నారాయణునికే సమస్తకైంకర్యములు జేయవలయునని తాత్పర్యము.

శ్లో॥ శ్రీరామానుజయోగిసుందరవరశ్రీశైలనాథాన్గురూన్ । లోకార్యోత్తరవీథికృష్ణకలిజిద్వేదాంతిభట్టారకాన్ । శ్రీగోవిందయతీన్ద్రపూర్ణయమునావాస్తవ్యరామాన్భజే । పద్మాక్షాహ్వయనాథయోగి శఠజిత్సేనేశపద్మాక్షరీన్॥

శ్రీరామానుజయోగులను సుందరవరులగు (శ్రమణనాళమహాముసలను] శ్రీశైలనాథులను, లోకాచార్యులను ఉత్తరవీథికృష్ణమాచార్యులను కలిజిత్ లకనంబిళ్ళగారిని వేదాంతియగు [నంజియ్యరును] శ్రీపరాశరభట్టారకులను శ్రీగోవిందులను యతీన్ద్రులను పూర్ణాచార్యులను యామునాచార్యులను, వాస్తవ్యులగు శ్రీరామమిశ్రులను శ్రీపుండరీకాక్షులను నాథమునులను శఠజిత్తులగు నమ్మాళ్వారిని సేనేశులను శ్రీలక్ష్మీదేవినిహరియగు శ్రీమన్నారాయణునిభజించుచున్నాను.

తదుపరి॥ శ్లో॥ శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవం యతీన్ద్ర ప్రవణం వన్దే రమ్యజామాతరం మునిం॥ తదనంతరం స్వాచార్య తనయులననుసంధించునది.

శ్రీమతే రామానుజాయనమః.

శ్రీవైష్ణవవిశిష్టాద్వైత సిద్ధాంతసంగ్రహము.

1 ఈసిద్ధాంతమందు శ్రీమన్నారాయణవాచ్యుడేపరతత్త్వము.

2 జీవేశ్వరులకుతండ్రికుమాళ్లవలెను భేదము.

3 మోక్షదశలోజీవుడువేరుగానే భగవంతునితోకూడ యానందమునను భవించును

4 మోక్షమునకు మార్గముభక్తిప్రపత్తులైయున్నది.

5 భక్తిఅనగా భగవంతునివిశ్వాసముతో పూజించుటమొదలుగునవి.

6 ప్రపత్తిఅనగా భగవంతుడుజీవునిరక్షించునని మహావిశ్వాసముగలిగిస్వస్థచిత్తులై యుండుట.

## శ్రీముక్తిసుందరరామదాసవిరచిత
## గీర్వాణసీసపద్యము.

మంగళంరాజకుమారాగ్రగణ్యాయ మంగళందేవసన్మానితాయ
మంగళంశతకోటిమన్మథాకారాయ మంగళంరాక్షసమర్దనాయ
మంగళంమునిజనమానసోల్లాసాయ మంగళంజనకాభిమతకరాయ
మంగళంనిఖిలభూమండలాధ్యక్షాయ మంగళంకలుషాభ్రమారుతాయ
మంగళమువిగతనిలసన్మానసాయ మంగళంపవనిజాచిత్తమధుకరాయ
మంగళ [illegible] మంగళం [illegible] కల్యాణ [illegible]॥

మత్పితామహులకు పితామహులగు శ్రీరామైక శరణ్యులగు ముక్తివి సుందరరామదాస విరచిత రామాయణసార సంగ్రహమందలి కిష్కింధాకాండములో నొక చిత్రసీసపద్యముగలదు. ఆపద్యము పటుత్వశైలిగలిగి అర్థగుంభనతో మిక్కిలి సగసుగానున్నదిగాన! నాపద్యము పేరును యాపద్యమునకు తెనుగు ప్రతిపదార్థము నిందు బొందుపఱచితిగాన పండితాగ్రేసరులందఱు దీని వీక్షింపగోరెదను.

8. ఈపద్యము పేరు॥ శ్రీమన్నగనియమ సంఘటానుప్రాసనిబంధక బంధురాపద్యాంతానులోమ విలోమవర్ణ విరచిత సుందరకంద, రథవృత్తరంగతురంగ వసంతతిలక, మంజరీపద సముచిత విద్యున్మాలాలంకృతి కంకణబంధనిబంధ నోదంచిత సర్వతోభద్ర పరికాశ త్రిపుటరూపకాటతాళ ఝంపాధ్రువమఠాదిసముజ్జృంభితద్వాత్రింశ ద్రాగరమ్య షోడశమిత్రింసంయుక్త గానవినోద విద్వదుల్లాసకరచతుష్షష్టి భేదకవనాత్యంత విచిత్రతమచిత్రసీసము.

సీ॥ అజనిజాగ్రజభుజానుజసుజాంగజయజార్క । జయజాంబుజభజాభజనభోజ
సురవరాదరవరాచరధరాచరధరాం । తరవరాకర పరాత్పరవిహారి
ఘనసనాతనజనావనమనావనమన । సున్నయనాయనధనా ధననిధాన
నతహితాశ్రితమతాన్వితహతాహతశతా । కృతయతాగ్రతరతోద్భతపదాతి
సవ్యభవ్యమహోత్తమ దివ్యకావ్య । వీరఘోరభయాపహాధార ధీర
శోణకోణసముజ్జ్వలద్బాణతూణ । ధామభీమశరాసనస్తేమరామ॥

పద్యమునకర్థము॥ అజ=జననరహితుడా, నిజాగ్రజభుజ, ని = జ్ఞానవంతులగు, జాగ్రజభుజ = బ్రాహ్మణులు భుజములుగాగలవాడా, అనుజసుజ =(తల్లిదండ్రులకు) అనుజులతోగూడినమంచిసంతానమైనవాడా, లేక తమ్ములకు సుమేరువలె జన్మించినవాడా, అంగజయ = అంగములను జయించినవాడా, జార్కజయజ, జార్కజ = జయశీలుడగు సూర్యపుత్రుడగుసుగ్రీవుడును, యజ =వాయుపుత్రుడగు నాంజనేయులును దాసులుగాగలవాడా, అంబుజ = ఉదకమందుండుమత్స్యస్వరూపుడా, లేక మేరుపర్వతమందుండువాడా, లేకఉదకమందు నివసించువాడా, భజాభజనభోజ, భ =సాంబ మూర్తి,జ = సరస్వతి, అ = బ్రహ్మలయొక్క, భజనభోజ =భజనలకుపాత్రుడా,లేకభజనముబొందినవాడా, సురవరాదర= దేవతలవిషయమైశ్రేష్ఠమగునాదరముగలవాడా,చరాచరధర= చరాచరములధరించినవాడా, అధరచరాంతిరవరాకర, అధరచర = సర్పములయొక్క, అంతర= మధ్యనుండు, వర =శ్రేష్ఠుడగునాదిశేషునకు,ఆకర=నివాసమగువాడా,లేకఆదిశేషునందుపవళించినవాడా, పరాత్పర =బ్రహ్మాదులకంటెనుత్కృష్టుడా, విహారి = విహారణశీలుడా, ఘన = ఘనులగుబ్రహ్మాదిదేవతలలోఘనుడా, సనాతన = పురాణపురుషుడా, జనావనమన = జనులరక్షించెడిస్వభావముగలవాడా, అ = శ్రీమహావిష్ణువన

శ్రీమతే రామానుజాయనమః

వనచరాయనధన, వనచర = అరణ్యమందు నివసించు తాపసులయొక్క, సునయన = మంచి నేత్రములకు, ఆయనధన = పొందబడిన భగవద్జ్ఞానసంబంధ దివ్యతేజస్సుగలవాడా, అధననిధాన, అధన = దరిద్రులకు, నిధాన = నిధివంటివాడా, నతహిత = నమ్రులకు హితుడా, ఆశ్రితమతాన్విత = ఆశ్రితులయొక్క అభిమతములతో కూడుకొనినవాడా, హతాహితతత = సంహరింపబడిన శత్రుసమూహముగలవాడా, అకృతయమతత్రత = అంతటను చేయబడిన నియమపూర్వకమగు రక్షణముగలవాడా, రతాద్భుతపదాతి, రత=అనురక్తులగునట్టియు, అద్భుత = అద్భుతులగునట్టియు, పదాతి=పదాతిభటుల గలవాడా, నవ్యభవ్య మహోత్తమదివ్యకావ్య, నవ్య = క్రొత్తదియగునట్టియు, భవ్య = శ్రేష్ఠమగునట్టియు, మహోత్తమ = మిక్కిలి యుత్తమము అగునట్టియు, దివ్య = మనోజ్ఞమగునట్టియు. కావ్య= కావ్యముగలవాడా, వీర = పరాక్రమశాలీ, ఘోరభయాపహ = ఘోర = భయంకరమగు, భయ = సంసారభయమును. అపహ = బోగొట్టువాడా, ఆధార = సమస్త దేవతలకు నాధారుడా, ధీర = మేరుపర్వతముతో సమానమగు స్థైర్యముగలవాడా, శోణకోణసముజ్జ్వలద్బాణతూణ, శోణ=ఎఱ్ఱనగు, కోణ=కోణములుగల, సముజ్జ్వలత్ = మిక్కిలి ప్రకాశించుచున్న, బాణతూణ=అంబులపొది గలవాడా, ధామభీమ=తేజస్సుచే భయంకరుడా, శరాసనస్థేమ=ధనస్సుయొక్క స్థైర్యముగలవాడా లేక ధనుర్ధరుడా రామ=శ్రీరామ యని యర్థము, ఇంకనీపద్యమున కనేకు లనేక విశేషార్థములు చెప్పిరి. గాన వానినన్నిటిని నిందు స్థలసంకోచముచే వ్రాయలేదు.

ఇట్లు శ్రీరామైక శరణ్యులగు ముక్కీపి సుందర రామదాస పౌత్రపౌత్ర శ్రీమహా భాగవతదాస శ్రీమద్రామానుజైక శరణ్య వేంకటతిరుమలదాసునిచే రచింపబడినది.

---

అటతాళం శ్రీరాగం.

మంగళం తే భగవన్ శ్రీకాకుళమందిరనిరతనివాస తే
మంగళమఖిలశుభాస్పదపద తే మంగళమాదిదేవ తే
మంగళం జయమంగళం శుభమంగళం

౧ వారిజలోచన శ్రీభూజిత వరవాసుదేవ పురుషోత్తమ తే
ధారాధరసుందర శంఖచక్ర గదాబ్జ శోభితహస్తాంబుజ తే॥ మంగళం॥

౨ శ్రీవల్లభ చతురాననముఖ సురసేవితపావనసరోజ తే।
శ్రీవైకుంఠ హృషీకేశ కేశవ శ్రీధర శ్రీకృష్ణ మాధవ తే॥ మంగళం॥

3 కరుణాకర భద్రగిరి రాఘవ సుందరరామదాసనిదాన తే।
స్థిరతర కృష్ణాతీరనివాస శ్రీకాకుళేశ జనార్దన తే॥ మంగళం॥

శ్రీమతే రామానుజాయనమః.

# నూతన గ్రంథములు.

1. స్మార్తకారికావృత్తి అనుస్మార్తకారికావళి ముద్రణమైనది, ఈగ్రంథమందుండు విషయములన్నియును యీస్వల్ప ప్రకటనలో వ్రాయవీలులేదు. గ్రంథము చూచిన మీకే విశదమగును. స్మార్తాభిమానులందరుం జూడదగిన సద్గ్రంథము, గృహ్యాసూత్రసహితము. ప్రతి 1 కి రు 0—12—0 పోస్టుఖర్చులు ప్రత్యేకము.

2. వాస్తుసంగ్రహము జ్యోతిషము తాత్పర్యసహితము ఇందు ప్రతిమనుష్యుండును గృహ కట్టవలసినవిధానము లన్నియును ఇందు గలవు. ప్రతి 1 కి రు 0—4—0

3. గౌతమీపుష్కర ప్రయోగము ఇందు మహానదీస్నాన సంకల్పం మొదలగు బహువిషయములను ఇందు తీర్థశ్రాద్ధవిధానమును కడపట గౌతమీపుష్కరకల్పమునుగలది ప్రతి 1 కి 0—8—0

4. కృష్ణాపుష్కరకల్పం ఇందు అనేక విషయములు చేర్చుచుండిమి. 0—2—0

5. ఋగ్వేద అపరప్రయోగానుక్రమణిక సస్వర ప్రయోగసహితముగా ముద్రింపబడినది ఈఅపూర్వమైన సద్గ్రంథమును జదివినంతనే సకలవైదిక ప్రాచీనసాంప్రదాయములు విస్పష్టముగాం దెలియును ఇట్టి ఉత్తమగ్రంథ మిదివఱకెప్పుడును బయలు వెడలలేదు ఎంతధనము వెచ్చించినను సరే ఇట్టిప్రయోగములు బోధించువారు దొరకరని ఋగ్వేదపాఠకులలో కొందఱు తెలియపఱుచుచున్నారు. ముద్రించినవానిలో 500 ప్రతులు విక్రయమైనవి వలయువారు వెంటనే వ్రాసికొనదగును, మంచి కిత్తాబైండుది ప్రతి 1 కి 1—8—0

6. యజుర్వేద వివాహోపనయనములు ఇందు అనుపనీత ప్రాయశ్చిత్తము మొదలు ఉపాకర్మోత్సర్జనమువఱకును ఇందుసూత్రీయవివాహము భట్టీయవివాహము మొదలు అప్పగింతలవఱకును గలదు యాజ్ఞికులకు అత్యవసరము సస్వరము ప్రతి 1 కి 0—12—0

ఆర్యానందప్రెస్ మచిలీపట్టణం.

